శ్రీ ర స్తు.



# శ్రీ భద్రాద్రిచరిత్రము.

ఇది

ధవళేశ్వరములో
డి. పి. వర్క్సు., హెడ్ క్లర్కుగానున్న
బొండాడ సూర్యనారాయణచే
రచియింపఁబడి

---

మచిలీపట్టణము టి. ఎల్. కె. ప్రెస్ నందు
తురగా నరసింగరావుగారిచే
ముద్రింపించి, ప్రకటింపఁబడినది.

---

మొదటి కూర్పు 500 కాపీలు.

# పీఠిక

శ్రీ గౌతమీమాహాత్మ్యంబు నందీ భద్రాద్రిచరిత్ర వ్రాయఁబడియున్నది. ఆ గ్రంథమును జదివి యర్థము నాకుృచ్చిన మ॥ రా॥ రా॥ శ్రీ. నున్న వేంకటాచార్యులవారికిని, భద్రాద్రి కేగుతఱి, యాత్ర తీఱిన పిదప. శ్రీరామానుగ్రహంబున, భద్రాద్రిచరిత్ర వ్రాయఁగలవాఁడవని, యాశీర్వదించి, తద్రచనకు, నన్నుఁ బురికొల్పిన, మ॥రా॥రా॥ శ్రీ. మైలవరపు నరసింహము పంతులుగారికిని, మ॥ రా॥ రా॥ శ్రీ. దర్భా ప్రభాకరశాస్త్రిగారికిని, నావందనములు. నావలె, యాత్రార్థమై వచ్చినట్టియు, నాకు బాంధవుండునైనట్టియు, మ॥రా॥రా॥ శ్రీ. పేరివెల్లి వేంకటస్వామి నాయుఁడుగారిని, భద్రాచలమునఁ గలిసికొనఁగా వారును, నన్ని గ్రంథరచనకు మిక్కిలి హెచ్చరించిరి. కావున వారికిని, నచ్చొత్తించుటకు మున్ని గ్రంథమును సాంతముగావినిన మ॥రా॥రా॥శ్రీ. శిష్ట్ల నరసింహశాస్త్రి గారికిని, మదీయ ప్రణామంబులు. శ్రీభద్రాచల గ్రంథ నిలయమువారిచేఁ బ్రకటింపఁబడిన భద్రాచలచరిత్రనాఁ బడు గద్యకావ్యమునకును, గౌతమీమాహాత్మ్యంబున వ్రాయబడిన విషయంబునకును గొంతభేదము కనఁబడుచున్నయది. ఈగ్రంథ మీరెంటి ననుసరించి వ్రాయఁబడినది.

ధవళేశ్వరము,
15-4-15.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
బొండాడ సూర్యనారా॥



శ్రీరస్తు

శ్రీరామచంద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీభద్రాద్రిచరిత్రము.

శ్రీలలర సుజన కోటికి ।
వెలసఁగుచు గిరులలోన • మేటియనంగాఁ ।
దాం తెలిసి భద్రాద్రి పర్వుఁ ।
గాంతెలిసి శ్రీరామభద్రుఁ • గరము నుతింతుఁ ॥ 1.

ముప్పగు వేల్పులఁ • బొలుపారఁ గొలిచెద ।
నిప్పచ్చరంబుల • న్నియుఁ దొలంగ ।
ముప్పురమ్మలకును • మ్రొక్కుల నొనరింతు ।
నక్కటికంబుతో • నరయు కొఱకు ।
ముక్కంటి గారాబు • ముద్దుపట్టిఁ దలంతుఁ ।
బనిచెఱుపులనెల్లఁ • బాఱఁదోలఁ ।
బొత్తముల్ వ్రాయంగఁ • బూనినవారలు ।
తప్పక గొలిచెడి • తలిరుబోడి ।

గీ॥ బమ్మదేవర రాణిని ♦ బసదనమ్ము ।
పలుకులానఁగంగఁ గైవార ♦ ముల నొనర్తు ।
కబ్బముల వ్రాసి యిలలోన ♦ నబ్బుమీాతి ।
తెనుఁగినట్టి జాణలకుఁ గే ♦ లెత్తువాఁడ! 2.

సీ. జయముగా రాక్షస ♦ నామ సంవత్సర
చైత్రమాసమునందు ♦ యాత్రవేళ ।
ఘనోత్సవమినాఁడు ♦ సురుచిరంబుగ రామ ।
కల్యాణమును గాంచి ♦ కరము నలరి ।
భద్రంబు లనయుంబుఁ ♦ బ్రజల కొసంగెడి ।
పర్వాత్మమైలగు ♦ భద్రిశైల ।
ఘనచరిత్రము పద్య ♦ కావ్యంబుగా వ్రాయు ।
కోరిక పొడమిన ♦ కారణమున॥

గీ॥ నట్టు లొనరింపఁ బూనితి ♦ నార్యులార! ।
తప్పులెన్నక దీని నా ♦ దరణసేయ ।
భక్తులగు మీాకచెల్లును ♦ బ్రాహ్మలార! ।
పండితోత్తములార! యో ♦ భవ్యులార! ॥ 3.

క॥ పాత్రము పూర్ణము నొందఁగఁ ।
జిత్రముగ ముదుంబ నార ♦ సింహస్వామిఁ ।
బత్తిమెయిఁ గొలుతు ముద్దుగ ।
నత్తముఁడై వెలయు నతఁడు ♦ సజ్జన నుతుఁడై॥ 4.

వారలపాపముల్ • వాపుమటంచెడి ।
భద్రాద్రిదలము తగు • భవ్యులార! ।
ఆభద్రశిఖరమం • దతిముదంబు దలిర్ప ।
శ్రీరామచంద్రుండు • సీతతోడ।
గీ॥ ననుజుతోడను వసియించి • యనుదినంబుఁ ।
దన్నుభక్తిమై దర్శించు • ధన్యులకును ।
ముక్తినొసఁగుచు నుండు న • ప్పుణ్య కథను ।
మీకు నెఱిఁగించెదను దయ • మీఱ వినుఁడి॥ ౯.

## —• శ్రీ భద్రాద్రిచరిత్ర కథాప్రారంభము. •—

సీ॥ అరులను గెల్చుచో • హరునకువిల్లయి ।
ప్రఖ్యాతిఁగాంచె నే • పర్వతంబు ।
జేజేలు తమకూర్మి • చెలులతోఁగూడి ।
క్రీడించుచుందు రే • గిరిని సతము ।
బంగారు కొండనై • పచ్చని వన్నెతోఁ ।
బ్రబలుచు నుండు నే • పర్వతంబు ।
సూర్యచంద్రాదులు • సొబగార వలగొనఁ ।
గ్రాలుచునుండు నే • గట్టురాయఁ ।
గీ॥ డట్టి మేరుగిరీంద్రుఁ డ • త్యధికభోగ ।
భాగ్యరాసులు తనకూర్మి • పడఁతితోడఁ ।
బెక్కువర్షముల్ పొందియుఁ • బ్రియతనూజుఁ ।
డొక్కఁడును లేక యున్కిఁ • బొక్కుచుండె॥ 10.

గీ. ఎన్నిసంపద లుండిన • నేమి? యొక్క ।
సుతుఁడు లేకున్న హావరాంబు • సున్నయగును ।
గద గృహాంబున నద్దాని • మదిఁదలంచి ।
కొడుకుఁ గోరుచునుండెను • కొండఱేఁడు ॥ 11.

క. అతని ప్రియసతియు నదే ।
రీతిఁ జింతించుచుండఁ • బ్రియుఁడు గని యో ।
నాతిరో! దుఃఖింపకుము వి ।
ధాతకు మనయం దొకింత • దయలేదకటా! ॥ 12.

గీ. గురుని సేవింపకయ విద్య • బొరయవశమె? ।
యన్న మొసఁగింపకయ విత్త • మందవశమె? ।
పూర్వభవమునఁ జేసిన పుణ్యమింతఁ ।
బొందకయ పుత్రకుల నిలఁ • బొందవశమె? ॥ 13.

ఉ. కావున నేగువాఁడ నిదె • కాననసీమకు నేఁగి, యందువా ।
శివునుగూర్చి చేసెదను • నిశ్చలమైనతపంబు ; దానిచే ।
నావిధిమెప్పుఁగా బడసి • యాతనితో మనకోర్కి చెప్పి యిం ।
దీవరనేత్రి నీవెతను • దీర్చెద వేగమె పోయివచ్చెదన్ ॥ 14.

క. నేవచ్చునంత వఱకును ।
నావంతయుఁ జింతలేక • యనుదినమున నీ ।
భావంబునఁ బరమేశ్వరు ।
భావింపుము భక్తితోడ • భద్రోదయమా! ॥ 15.

చ॥ అనుటయు నాసతీమణియు • నాత్మవిభుం గని ప్రాణనాథయీ
వ్వనమున కేమువచ్చితిమ • పాదములొత్తుచుఁ గూరుచుండి సే
వను బొనరింపఁ గోరెదను • వల్లనకియ్యకొనుండు నాపురం
దరపతిఁ గాంచి నవ్వుచును • దద్దయుఁ బేర్మి గిరీంద్రుఁ డిట్లనెన్

గీ॥ కందమూలాదులను దిని • కాననమునఁ ।
తపమొనర్చెను వానికిఁ • దరుణి యెదుటఁ ।
గానుపించిన ఫలంబు • గలుగుఁ గానఁ ।
బడఁతి యుండంగఁ దగదు తా • పసుని మ్రోల॥ 17.

ఉ॥ కారణమెట్టులుండ నిఁకఁ • గాంతరో! నిర్జనసీమయందుబల్ ।
కూరిమిలో మదంఘ్రులను • గోమలమౌ భవదీయహస్తపం ।
కేరుహ మంటినంతటనె • కేసుచుమాయను హానిఁ జేసెడిన్ ।
వారిజనేత్రి యందువల • నట్టి దపమ్మెట్టులుసేయ నోపునే॥

గీ॥ తపము నొనరించి మించి వి • ధాతఁ గాంచి ।
వరకుమారునిఁ గనియెడి • వరముఁ బడసి ।
మేఁగఁ దనదెంచువాఁడ నో • చెలిమిన్న! ।
యంతదనుక నీవిచట నే • యాసు మబల! ॥ 19.

క॥ అని తఁ దేవిని వీడ్కొని ।
ఘనుఁ డా గిరివర్యుఁ డపుడ • కాననమునకున్ ।
జని యచ్చోటున నిశ్చల ।
మనమునఁ దపమాచరించె • మానులు వొగడన్॥ 20.

క॥ ఎంతల వానల నలయుచు ।
నుండియు బహువత్సరంబు • లుద్దండ తపం ।
బండఁజవాహాను గూరిచి ।
కొండలమొకిమిాను చేసెఁ । గొంకక భక్తిన్॥ 21.

సీ॥ పరమేష్ఠి యమ్మేరు • గిరితపంబున కాత్మ ।
నలరి వాగ్దేవితో • హంసనెక్కి ।
సకల బృందారకుల్ • సర్వమునీంద్రులు ।
సంస్తుతి నొనరింప • సంతసించి ।
మేరుగిరీంద్రుని • మిక్కిలి ప్రీతితోడఁ ।
దపమాచరించెడి • స్థానమునకుఁ ।
జని కొండమొదటను • సాక్షాత్కరించిన ।
గని గట్టురాయఁ డ • గ్గలపుభక్తి॥

గీ॥ పెంపునను వేల్పుపెద్ద ను • తింపనెంచి ।
యతని తేజంబునకుఁ గను • నబ్రి పసుదు
నోట మాట రాకుండె యు • న్నానకాంతి ।
మించు నద్దేవునక్లె వీ • క్షించుచుండె॥ 22.

క॥ అతని మతిభ్రమముగ గని ।
చతురాస్యుం డిట్టులనియె • నస్మితముఖుఁడై ।
మతిమంతి! యెఱుఁగఁ బల్కుము ।
మతిలో పలివాంఛ నేను • మాన కొసఁగెదన్॥ 23.

క॥ పదిదివసములైన పిమ్మట ।
మదిరాక్షికిఁ జేసి రెలమి • మగువల్ పురిటిన్ ।
బదిలముగా వత్సయు పొం ।
పురవరి నుయ్యాల మంచ • మున శయనింపన్ ॥ 43.

క॥ జోజో ముద్దుల పట్టీ ।
జోజో రతనాల పెట్టి • జోజో చిట్టీ ।
జోజో కూరిమి జెట్టీ ।
జోజో యని పాడి రవుకు • సుదతుల్ జోలల్ ॥ 44.

క॥ దిన దినము వృద్ధి నొందెడి ।
వనజారి విధానఁ జెరుగు • బాలునిఁ జేర్చన్ ।
గనుఁ గొనుచుఁ దల్లి దండ్రులు ।
ఘనముగ శౌచాదులెల్లఁ • గావించి రొగిన్ ॥ 45.

క॥ తనయున కెలమిని భద్రిం ।
డనియొసఁగి నామంబు నిడఁగ • న బ్బాలుండున్ ।
జననీ జనకులు " భద్రి " ।
యని పిలువఁగ నగుచు వారి • యండకుఁ బాఱున్ ॥ 46.

సీ॥ అంత నైదవయేట • నబ్బాలుఁ డాచార్య ।
వరులొద్ద నక్షరా • భ్యాసమందె ।
సకల శాస్త్రంబులు సత్వరంబుగ నేర్చె ।
విద్యల నన్నిటఁ • బెద్దయయ్యె ।

బాలకుండయ్యును • బరమేశ్వరుని పాద |
పద్మంబులే మదిఁ • బ్రస్తుతించు |
శిష్యులతోఁ జెల్మిఁ • జేయుచు నుండును |
దుష్టులఁ విడుచును • దూరముగను |

గీ. పెద్దవారలఁ గను గౌర • వించుచుండుఁ |
దల్లిదండ్రుల యాజ్ఞలఁ • దప్పకుండు |
లీలలందును దబ్బరల్ • లేకయుండు |
వశమె పొగడంగ భద్రుని • వరగుణములు ‖ 47.

క. జననీజనకుల వలనన్ |
తన జన్మ క్రమముఁ దెలిసి • దశరథసూనున్ |
గనుఁ గొనఁగ నెంచి వారల |
యనుమతిఁ గొని చనియె భద్రుఁ • డటవీ స్థలికిన్ ‖ 48.

సీ. కానక కన్న సం • తానంబు గావునఁ |
గన్నవారల ఖేద • మెన్న వశమె ? |
సంసార వనధిలో • సంచరించెడి వారు |
కష్టముల్ సహియింపఁ • గావలయును |
దలఁచి చూడంగ వీ • డుల చందమున బార్య |
కర్మముల్ చేసినఁ • గలచుచుండు |
నొకవేళ సంయోగ • మొకవేళను వియోగ |
మొదవుచు నుండు నీ • యుర్విలోన |

గీ॥ జనన మరణంబులను నిల్క • స్థానమైన ।
భవజలధి నీద నేత్ర యు • పాయ మెద్ది ।
సకల జీవులయందును • సదయుఁ డగుచుఁ ।
బరగు చుండెడి పరమాత్ము • భక్తి దక్క ॥ 49.

— • భద్రుఁడు తపంబున కేగుట • —

గీ॥ భద్రుఁ డమ్మాద్రి నదులను • బర్వతముల ।
దాటుచును బోయి గౌతమీ • తటముఁ జేరి ।
త్ర్యంబకంబను జోటునఁ • దానమాడి ।
ప్రీతితోఁ జేరె పంచవ • టీ తటంబు॥ 50.

సీ॥ అచ్చోటు నెడబాసి • యాతంపు దండకా ।
రణ్యంబుఁ బొడ గాంచి • ప్రీతిత భక్తి ।
గౌతమీ మధ్యను • బ్రీతి మై నిలచిన ।
వీరభద్రస్వామి • వినుతి సేయ ।
నా భద్రి నుతులకు • సద్దేవుఁ డలరారి ।
యాతని వాంఛి తం • బాత్మ నెఱిఁగి ।
యిట్లనె నతనితో • నిదెచూడు మీనదీ ।
పూర్వ భాగము నందుఁ • బొలుపు మీరు ।
గీ॥ కానుపించెడి స్థలము ని • క్కముగఁ గరము ।
పావనంబగు నచటఁ ద • పంబుఁ జేయు ।
మనుచు నానతి యిచ్చిన • నచటి కేగె ।
నద్రిసూనుండు సుగుణుండు • భద్రి యశుఁడు 51.

క. చిలుకలు మొదలగు పక్షుల ।
పలుకులతో నమరి పాద ◆ పంబుల తోడన్ ।
తెలువారు నా స్థలంబునఁ ।
దలపోసెను గిరిసుతుండు ◆ తప మొనరింపన్ ॥ 52.

తే. విమలసరోవరజలముల ◆ వేడ్క మిగుల ।
స్నాన మొనరించి శుచియయి ◆ నగసుతుండు ।
పశ్చిమాభి ముఖుండయి ◆ పరమ భక్తి ।
ఎసర శ్రీరాము రాకకై ◆ తప మొనర్చె ॥ 53.

ఉ. అంతకుమున్నె యీ భువన ◆ మంతయు వారల చాలఁ
జేసి యా । వంతయు నష్టలేక బల ◆ వంతుఁడు రావణా
సుర్ ఖలుండు బల్ । కాంతిఁ దనర్చు నద్దనుజ ◆ కాంతుని
జంపఁగ దేవతల్ రమా । కాంతుని వేడ వారి కడ ◆ గండ్ల
ను బాపఁ దలంచి కూరిమిన్ ॥ 54.

## — ◆ శ్రీరామచరిత్ర కథా సంగ్రహము. ◆ —

సీ॥ మాధవాంశంబున ◆ మహిలోన జనియించి ।
దశరథ సూనుఁడై ◆ తనరి రాముఁ ।
డనుపేర వెలయుచు ◆ జనకుండు పంపవి ।
శ్వామిత్రుతో నేగి ◆ సమర మందుఁ ।
దాటక మర్దించి ◆ తపసి జన్నముఁ గాచి ।
మేటి సుబాహుని ◆ గీటడంచి ।

ఫాలాక్షు చాపంబు • భగ్నంబు గావించి ।
ప్రీతిమై జానకిఁ • బెండ్లియాడె ।

గీ॥ రామచంద్రుండు భార్గవ • రాము గర్వ ।
మెల్ల వారలు వీక్షింప • నుల్లమలర ।
భంగపఱచెను శ్రీరామ • పౌరుషంబు ।
నలవియే కొనియాడ ? వే • ల్పులకు నైన॥ 55.

క॥ జనకుండు కైకకు వశుఁడై ।
వనమునకుఁ దన్నుఁ బనుప • వనితా మణితో ।
ననుజునితో విపినమునకు ।
జనపతియగు రాముఁ డరిగె • సత్వర లీలన్॥ 56.

గీ॥ విరతమును దన్ను గొలిచెడి • భరతునకును ।
రాజ్యమును జేయు మానతి • రాముఁ డొసఁగి ।
చిత్రకూటాచలము నెక్కె • సీత కవటి ।
వింతలను జూపె శ్రీరామ • విభుఁడు పేర్మి॥ 57.

సీ॥ అచ్చోటు నెడబాసి • యారాఘవేంద్రుండు ।
దండకా రణ్యంబు • దండఁ జేరి ।
గౌతమీ స్నానంబుఁ • గావించి తన్నదీ ।
మధ్యమ్మునఁ దగుచు న • మంద కాంతి ।
వెలయుచు నుండెడి • వీర భద్రస్వామి ।
వినుతింప నాతండు • వినిచె భద్రి ।

చారిత్రమంతయు • శ్రీరఘువరునకు ।
సద్దాని నాలించి • యాత్మ నలరి ।

గీ॥ తనదు భక్తుఁ డౌ భద్రునిఁ • గనుఁ గొనంగ ।
రామ చంద్రుండు చనియెను • బోయ తోడ ।
నట్లు చని భద్రు నెదుటను । నతివ తోడ ।
ననుజు తోడను నిలచుండె • నినకులుండు॥ 58.

క॥ మేరుకుమారుం డా రఘు ।
వీరునిఁ దిలకించి మొలక • వెల్లి విరియఁగా ।
శ్రీరామ చంద్రు నిట్లని ।
నేరుపుతోఁ బొగడఁ దొడ్గె • నిశ్చల భక్తిన్॥ 59.

ఉత్సాహ॥ నీరజాక్ష! దైత్యదమన! నీలవర్ణ! రాఘవా! ।
మేరుధీర! జానకీశ! • మేదినీశ కుంజరా! ।
శూర! భక్త పారిజాత! • సూర్య వంశ దీపకా! ।
మార జనక! రూప విజిత • మార! దీన పోషకా!॥

క॥ కరుణాకర! రిపులమునను ।
శరణని నినుఁ జేరఁ బ్రోచు • జాణవు మున్నా ।
హరి నేలినట్టి దిట్టవు ।
పరమాత్మా! నీదు పాద • భక్తుఁడ నయ్యా॥ 61.

క॥ తనువు శిలా మయముగఁ గన ।
వినుమీ నే జడుఁడ నైతి • విభు [illegible] ।

నిన్నుఁ గాని యెఱుఁగ, రఘువర! ।
వనజ భవుఁడు చాలఁ డనఁగ • వశమే నాకుఁ॥ 62.

కం॥ సీతావల్లభ ! నీవును ।
సీతయు లక్ష్మణుఁడు నాదు • శిరమున నెపుడుఁ ।
ప్రీతి మెయి నిలువఁ గోరెద ।
నాతతకృప నాకు నొసఁగు • మా తద్వరముఁ॥ 63.

ఆ॥ వె॥ భరతుఁ డిట్లు తన్నుఁ • బ్రార్థింప రఘుపతి ।
యతనితోడ ననియె • నద్రి తనయ ।
యవతరించినట్టి • యక్కార్యమును దీర్చి ।
నీదు శిఖరమందు • నిలుచువాఁడ॥ 64.

కం॥ అని యానతిచ్చి దండక ।
వనమున నుచిత స్థలమునఁ • బర్ణకుటీరం ।
బును నొకటి కట్టికొని తన ।
యనుజునితో భార్య తోడ • నచ్చట నాగెఁ॥ 65.

సీ॥ అవిపినంబున • రావణానుజ శూర్ప ।
ణఖ నివసించుఁ ద • న్నారి రాము ।
వీక్షించి యాతని • విభుని గాఁ గోరిన ।
ఖండించె సౌమిత్రి • కాంతముక్కు ।
నంతట ఖరదూష • ణాదులు వచ్చిన ।
రాముండు చక్కాడె • రణములోన ।

నటనము దశకంఠు • నంతికంబున కేగి ।
యా శూర్పణఖ యిట్టు • లనుచుఁ బలికె ।

గీ॥ నోరి నాయన్న నీవిటు • లూరకుంట ।
తగున ? నాముక్కు రాముని • తమ్ముఁ డిటుల
గోసినని యగ్రజుని మ్రోల • గోల్లు మనుచు
వెలఁది యేడ్వంగ సాగెను • వెక్కి వెక్కి ॥ 66.

సీ॥ ఆక్రాంత నూరార్చి • యా యింతిచే సర్వ ।
వృత్తాంత మాలించి • వేగ రథము ।
నెనలేని ఠీవితో • నెక్కి పఙ్క్తి ముఖుండు ।
మారీచు నంప న • మ్మాయ కాఁడు ।
బంగారు వన్నెలో • బసమీఱు నిఱ్ఱియై ।
నటియించు చుండ న • క్కుటిల మతిని ।
శ్రీరామ చంద్రుండు • శీఘ్రంబ నుగ్గాను ।
తఱిని సీతాదేవి • దైత్య విభుఁడు ।

గీ॥ రథము పై నిడి తా వఖ్రి • పథము నందుఁ ।
బోవు చుండ జటాయువు • త్రోవ కడ్డ ।
మగుచుఁ బోరిన నాతని • సమర జంపి ।
త్వరితముగ నేగెఁ దన రాజ • ధాని కంత ॥ 67.

క॥ సీతను గావక రఘుపతి ।
సీతాయని పలవ రించు • సేగిఁ జెందుఁ ।

గాతిరియూరు బవలు వదే ।
రీతిగ దన మనమునందుఁ • భీతియుసీ దలఁచుగా॥ 68.

క॥ సీతా పతికా సర్వము ।
సీతామయ మగుచుఁ దోఁప • సీతా యనుచుగా ।
ప్రీతి మెయిఁ బిలచి పిలచియు ।
సీతను గనలేక వంతఁ • జెందుచు నుండగా॥ 69.

ఆ॥ వె। శౌనకాదులార! • సర్వజ్ఞుఁ డయ్యును ।
, మనుజమాత్రు నట్లు • మానసమున ।
రమణిఁ గూర్చి వగచె • రాముఁ డీ దైవపి ।
నతని లీల లరయ • నద్భుతములు॥ 70.

ఉ॥ పిడయుఁ బోలె నన్నపుడు • నీవెడ బాయక యుండి యు
క్కటూ! । చేతయు యివ్వ దివ్వగిది • చేయుట ధర్మము
కాదు? ప్రియతో! । కూడిన చూమ్ముల బట్టి • కోమలి
వాదిన చూడవేల ? నీ। వాఁడను గాక యేమి పెరు • వా
డనా ? చాటున దాగ నేటికే?॥ 71.

ఉ॥ అవినయంబు లా గుణము లా భయ భక్తులు నా సుశీల
ముగా । భావమునగా దలంచిన గు • భాలున దుఃఖము
పొల్లి వచ్చెడిగా । నీ వదనాంబుజంబు గన • నేతుగా నా
నేరనా ? అవనీశ్వరి ! । యిగా విపులాటవీస్థలిని • నెంతటి
కష్టము లందు చుంటివో॥ 72.

చ॥ జనకా నేను నీకు భుజ • శాఖల చాటున నుండ నాకిటుల్
వనమున భీతియేల యని • పల్కిన పంక్తి పదాళిక్తి యు
ద్యోగా ! వనజదళాయతాక్షి! నిను • వంటి సుభార్యను
గావలేని నా । జననము వ్యర్థమాయెను గ • జంబుగ ; ...
యింక నేమి సేయుదున్? ॥ 73.

క॥ పికమా ! సీతను గాయుట ।
శుకమా, చిగురాకు మెక్కి • పొక్కుచు నిటకే బా ।
దికమా ; రోషంబున బా ।
పకమా ; వినకున్నఁ జేటు • వాటిల్లుఁ జుమా॥ 74.

సీ॥ అట్టు లలమటఁ జెందెడి • యగ్రజునకు ।
లక్ష్మణుఁడు ధైర్యమును జెప్పి • లలన వెదకు ।
తఱి జటాయువుఁ గన్గొని • దహన మొసఁగి ।
చేరి ఋశ్యమూకము వారు • చేరి రంత॥ 75.

సీ॥ వాలిని వధియించి • వాని రాజ్యంబును ।
సుగ్రీవునకు నిచ్చి • పొందు మీఱి ।
శ్రీరామచంద్రుండు • సీతను వెదకంగ ।
హనుమంతు నంపిన • నతఁడు వనధి ।
వలవాటు కలిమిచే • నవలీలగా దాటి ।
లలనను గన్గొని • లంకఁ గాల్చి ।
రాముని పాలికి • రయమున వచ్చి నీ ।
తా కథనంబును • దగ వచింప ।

గీ॥ రాము చరమ్రింమ కపి వేగి • రంబు కదలె ।
ప్లవగ సైన్యంబు లను గూడి • లంక దెసను ।
దారివ కడ్డ మై యుండిన • తోయధి గని ।
సేతువును గట్టి జలధిపై • శీఘ్రముగను॥ 76.

ద్వి॥ రావ.బలిమ్మ్నను తలచ్నగా ।
గావు ననుచు శరణు వేడఁ • గా నభయంబుగా ।
భగావరుఁ డొసంగి లంకకు ।
నే పదలెను సేన తోడ • విబుధులు మెచ్చగా॥ 77.

సీ॥ ఆ సమయంబున • నసుర వానరులకు ।
బహు ఘోర రణము సం • ప్రాప్త మయ్యె ।
హరితోడ హరియును • గిరితోడ గిరియును ।
బోరెడి విధమునఁ • బోరి రలుకఁ ।
సెలఁగి వీరులు సేయ • సింహ నాదములతో ।
భూ నభోంతరములు • పూర్ణ మయ్యె ।
రక్త ప్రవాహంబు • ప్రవహించె ఖండిత ।
వయవముల్ ఝషముల • వలెఁ దనర్ప ।

గీ॥ నట్టి ఘోరఖండనమున • నసురు లెల్ల ।
మ్రగ్గుటను గాంచి దేవారి • మండి పడుచుఁ ।
బుష్పకారూఢుఁడై యేగెఁ • బోరునకును ।
వివిధభూషణంబులఁ దాల్చి • విక్రమమున॥ 78.

క॥ మాతలి తెచ్చిన తేరును ।
సీతేశుం డెక్కి దైత్యు • శీఘ్రము చంపెన్ ।
ప్రీతినిఁ బొందిరి నిర్జరు ।
లాతత దుఃఖంబు నొంది • రసు రాంగనలున్ ॥ 79.

ఆ॥ వె॥ వహ్ని వలనఁ దనదు • భార్య నిర్దోషత్వ ।
మెల్లరకును నృపతి • యెఱుఁగఁ జేసి ।
దేవతలు నుతింప • దేవిఁ జేకొని లంక ।
రావణానుజునకు • రాముఁ డొసఁగె॥ 80.

ఆ॥ వె॥ సురలు గురియు పూల • సోనలఁ దడియుచు ।
హనుమదాదులెల్ల • నలరి కొలువఁ ।
బుష్పకంబు నెక్కి • పురవరం బగు నయో ।
ధ్యకును రాముఁ డరిగె • సతి ముదమున॥ 81.

ఆ॥ వె॥ అన్న వచ్చు టెఱిఁగి • యతి భక్తి పాదుకల్ ।
మోచి కొనుచు వచ్చి • మ్రొక్కె భరతుఁ ।
డతని నాదరించి • యతనితో వచ్చిన ।
బ్రాహ్మణులకు మ్రొక్కె • రామ నృపతి॥ 82.

క॥ అంత నయోధ్యా పురిని వ ।
సంతంబులఁ బూలతోడ • సర్వరి జనముల్ ।
సంతోషముతోఁ బాడిరి ।
వింతయయిన కాంతి గలిగె • వీటికి నెలమిన్ ॥ 83.

ఆ॥ వె॥ రాజసదనమునకు • రాముఁ డేతెంచు ।
వచ్చు సమయమందు • వన్నె మీఱ ।
రామమయము లగుచు • రాజిల్లె సౌధాగ్ర ।
భాగములు పురాన • భాసురముగ॥ 84.

శా॥ సీతాజానియు లక్ష్మణుండు గృహముల్ • చేరంగ మో
దించి త । న్మాతల్ సూనులఁ బెద్ద కోడలినిఁ జేరి • ముం
జేసి ముద్దాడుచున్ । మాతంబ్రిల్ చను దెంచి నారె
యిటకున్ • మాయమ్మ! మా కూన యో సీతా! యెట్లు
చరించితే యడవిలో? • శీతాంశు బింబాననా!॥ 85.

గీ॥ ఇట్లు లడిగెడి యత్తల • కెల్ల మ్రొక్కి ।
జానకీదేవి వారల • సరస నుండి ।
తేన లొలికెడి పలుకులఁ • దెలిపె నఖిల ।
వార్తలను బూస గ్రుచ్చిన • భంగి దనర॥ 86.

గీ॥ రాముఁడును లక్ష్మణుండును • జేరి తోడ ।
మాతలకు మ్రొక్కి వారలు • ప్రీతి నొందఁ ।
సమరమున రావణాదులఁ • జంపి నట్టి ।
వార్త లన్నియుఁ దెలిపిరి • వారలకును॥ 87.

సీ॥ పట్టాభిషేకోత్స • వంబు వసిష్ఠుండు ।
కులవృద్ధులును జనం • బులు నొనర్ప ।
భరతుఁ డర్పించిన • భవ్య సింహాసనా ।
సీనుఁడై ప్రజలను • జెలువు మీఱ ।

పదునొక వేల సం ♦ వత్సరంబులు వరి ।
పాలించె రాముండు ♦ ప్రజలు సౌఖ్య ।
వారాసిలో మున్గి ♦ వర్ధిల్లు చుండిరి ।
ధర్మ మెల్లెడలను ♦ దనరు చుండెఁ ।
గీ॥ దండ్రి కై వడి శ్రీరామ ♦ ధరణి పతిని ।
జనము లెంచుచు నుండి రా ♦ జవరేణ్యుఁ ।
డవతరించిన పనిదీరి ♦ నంతఁ దనదు ।
మొదలి నెలవున కేగెను ♦ ముదముతోడ॥ 88.

ఉ॥ రాముని రాకకై మనసు ♦ రంజిల భద్రుఁడు పెక్కు వర్ష
ములే । ప్రేమ మెలర్పఁ గాచికొని ♦ వేచెను రాముఁడు
రాఁడికేసి యాస్వామిఁ దలంచుచుండెను న ♦ జస్రము ;
పిమ్మట నారదుండు శ్రీ । రాముని వార్తఁ దెల్పఁగ దు ♦
రంత విషాదము నొందె నాత్మలోన॥ 89.

గీ॥ నారదుండుపదేశించె ♦ నలిననాభుఁ ।
గూర్చి తప మాచరింపుము ♦ కొండకొమర ॥
నీదు కోరిక కొనసాగు ♦ నిశ్చయముగ ।
నిను సక్షాత్కరింపంగ ♦ నాతఁ డెంచి॥ 90.

గీ॥ భద్రుఁ డిట్లని తలపోసి ♦ భావమందు ।
నవతరించిన పనిదీరి ♦ నంత నీదు ।
శిరమునం దుందువని నాకుఁ ♦ జెప్ప నేల ।
రాముఁ డింకను రాఁడొక్కొ ♦ ప్రేమనిధీ! ॥ 91.

గీ॥ అవతరించిన పనిదీర • దతని కొఱకు ।
నవతరించుట యనుమాట • యన్నృతమగును ।
అజుఁడు గావున శ్రీహరి • యవతరించె ।
ననుచు జనములు పల్కుట • యగుచు గల్ల॥ 92.

మ॥ అరయన్ శ్రీహరి పెక్కునామములచే • నాయాయి కాలం
బులన్ । గరమున్ దుష్టులఁ గిన్కతోఁ బలుమఱున్ •
ఖండించుచున్, శిష్టులన్ । బరిరక్షించుచునుండెఁ గాంచి
జనముల్ • భావింతు రక్షాత్ముఁ డిద్ధర జన్మించె నటంచు
జన్మచయముల్ • దైత్యారికిన్ గల్గునే? ॥ 93.

క॥ హరిమాయ హరియె యెఱుఁగును ।
హరిమాయా లీలలకును • నంతము గలదే? ।
శిరమున వసించు మనసును ।
హరిఁ గోరుట తలఁచి చూడ • నజ్ఞానంబౌ॥ 94.

క॥ అరయఁగ విష్ణుం డంతటఁ ।
బరిపూర్ణుండగుచు నుండఁ • బరమాత్ముఁడు నా ।
శిరమున నుండడె? యాతని ।
నరయఁగ శక్తి నకట • యజ్ఞానముచేన్! ॥ 95.

క॥ హరికరుణ చేత నెవ్వఁడు ।
పరిపాకముఁ బొందె మనసు • పావనమై నం ।
నరగార్థి ముముక్షు వరులకుఁ ।
బరిపాకము గలుగు టరుదు • భావింపంగన్॥ 96.

ఉ॥ కావున రామరూపమును ◆ గైకొని నాశిరమందు నిల్పి య
న్దైవుని శ్రీరమాపతి ను ◆ తించెదఁ దద్దయు భక్తి పెంపు
న౯ । భూవిభుఁడైన యాపరమ ◆ పూరుషుఁ డాదరించి వచ్చి
రక్తితో । సేవ లొనర్చువారి ◆ యఘచేతన మాన్పి నను
నిల్పుఁ గావుత౯॥ 97.

ఆ॥ వె॥ భద్రుఁ డిట్లువలఁది ◆ బహుశాస్త్రముల కోర్చి ।
ప్రజలమేలుఁ గోరి ◆ పరమ తపము ।
వేయివత్సరములు ◆ విష్ణుఁగూర్చి యొనర్చె ।
వాయుభక్షుఁ డగుచు ◆ వనమునందు। 98.

గీ॥ చెలఁగి సర్వేశ్వరుని యందు ◆ జీవితమును ।
కరము ఘటియింపఁ జేసె । నగ్గిరిసుతుండు ।
గాన సర్వేశ్వరుఁడు కడుఁ ◆ గరుణ మందె ।
నంత సర్వలోకంబులు ◆ నదలఁ జొచ్చె॥ 99.

ఉ॥ ఆ యిరుమార్గ గనుంగొనుచు ◆ నాతిఁ వహింప పిలించి
పాలిక౯ । బోయి సమస్త దేవతలు ◆ ముక్తికగ వారల
తోడ భారతి । వాయువుఁ జేగ మెరుగిరి ◆ వందను పాలికి
నట్లుపోయి యాధీయుతుఁ గాంచి కాంధికముఁ ◆ జెల్పు
మొసంగదవంచుఁ బల్కిన౯॥ 100.

గీ॥ భవుఁ డిట్లన నతనితో ◆ బ్రహ్మదేవ ।
రామచంద్రుండు నాశిఖ ◆ రంబు నందుఁ ।

దగ వసింపంగఁ గోరి యీ • తపముఁ జేయు ।
చున్నవాఁడను బరమాత్మ • తో విధాత!॥ 101.

గీ॥ అవతరించిన పనిదీరి • నంత నీదు ।
శిఖరమం దుందునని నాకుఁ • జెప్పి రామ ।
విభుఁడు వైకుంఠపురికిఁ దా • వెడలిపోయెఁ ।
గరుణ లేదయ్య నామీఁద • ధరణిపతికి॥ 102.

గీ॥ జానకీజాని నాయందు • సదయుఁ డగుట ।
యెన్నఁడో శుభప్రదములై • యొసఁగునట్టి ।
యతని పాదారవిందంబు • లాత్మ శిఖర ।
మందు వహియించు టెన్నఁడో • డెందమలర॥ 103.

క॥ అని యిట్లు వగచు భద్రునిఁ ।
గనుఁగొని కమలాననుండు • కరుణా మయుఁడై ।
వనజదళాక్షుని చెంతకుఁ ।
జనియెద నీకోర్కెఁ జెప్పు • శైలకుమారా!॥ 104.

క॥ వగవకుమని ధైర్యంబును ।
దగఁజెప్పి విరించి యేగ • దైత్యారాతిఁ ।
ఖగరాజ తురగు హరిఁ బ ।
న్నగశయనునిఁ జూడ సురగ • ణంబులతోడన్॥ 105.

సీ॥ పద్మాసనుం డంత • వైకుంఠ ధామంబు ।
సంతోషమునఁ జొచ్చి • జలజనయను ।

వీక్షించి రామా దేవ! • విన్నపం బొక్కటి ।
యున్నది యాలింపు • మోముకుంద! ।
మేనకుమారుండు • చారుచరిత్రుండు ।
భద్రుండు నానొప్పు • భద్రయోగుండు ।
ఘోరతపంబును • ధారుణీ స్థలమునఁ ।
గావించుచున్నాఁడు • కంజనేత్ర! ।

గీ॥ వరమొసంగితిరట వాని • శిరమునందు ।
నిలచి యుండంగ నద్దాని • నెదను మఱచి ।
పరవికుంతంబుఁ జేరిన • వార్తను విని ।
కరము దుఃఖించుచున్నాఁడు • పరమపురుష! ॥ 106.

క॥ అని పలుకు సరసిజాసనుఁ ।
గనుఁగొని కనకాంబరుండు • ఘనుఁ డిట్లనియెన్ ।
గనకాచల వరసుతునకు ।
మును నొసఁగిన వరముఁదీర్పఁ • బోయెదను సుతా! ॥ 107.

గీ॥ ఎల్లదేవతలను గూడి • యేగి భద్ర ।
పర్వతముచుట్టు నిలువుమీ • త్వరితముగను ।
రామరూపంబుఁ గైకొని • రమణితోడ ।
ననుజుతోడను వచ్చెద • వచటికిపుడు ॥ 108.

క॥ అని కైటభారి పల్కఁగ ।
ఘనతర హర్షమును బొంది • కమలాసనుఁ డిం ।

పెం(యగ దివిజాలతో నే ।
గను భద్రాచలముఁ జేరఁ ♦ గోరుఁ డంతఁ॥ 109.

సీ॥ శ్రీరామరూపంబుఁ ♦ జెలువారఁ దాలిచి ।
పట్టాభిషేకోత్స ♦ వంబు జరుగు ।
నప్పు డేరీతిని ♦ వెలరారెనో యట్లు ।
వివిధభూషణములఁ ♦ వేడ్కఁ దొడిగి ।
పీతాంబరంబును బ్రీతిమై ధరియించి ।
కంబును జక్రముఁ ♦ గార్ముకంబు ।
శరమును నాలుగు ♦ కరములఁ దనరార ।
భార్యయుఁ దమ్ముండు ♦ భక్తిఁ గొలువ ।
గీ॥ నధికదీప్తిమై భద్రాద్రి ♦ నవతరించి ।
భక్తవరుఁడైన భద్రుని ♦ బరమహర్ష ।
వార్ధిలో మున్గఁగాఁజేయ ♦ వనజభవుఁడు ।
సురలు శ్రీరాముఁ బొగడిరి ♦ కృరణి భక్తి॥ 110.

మ॥ వరముల్ పొందితి బ్రహ్మచేతనని గ ♦ ర్వంబుఁ మదిఁ
బూని భీ । కరుఁడై రావణుఁ డుద్ధతిఁ భువనముఁ ♦ గ
ష్టాబ్ధి ముంపఁగ నం । ద్దురితాత్ముఁ రణరంగమందుఁ గిను
కఁ ♦ దువ్మాడి లోకంబులఁ । బరిరక్షించిన రామ నిన్ను
మదిలో ♦ భావింతు మెల్లప్పుడున్॥ 111.

చ॥ శరణని వేడఁగాఁ గృపను ♦ శత్రుని తమ్ముని నవ్విభీషణుఁ ।
గర మమరక్తి రాజుగ నొ ♦ నర్చితవార మహాత్మ! నీకు నా ।

వ్యయపరు లేరు బాంధవులో ◆ యేర్పడఁ జెప్పఁగ శక్యమా
నే? సత్కరుణను శిష్టబృందమును ◆ గాఁచి వధింతువు దుష్ట
బృందముఁ॥ 112.

మత్తకోకిల॥ లోకరక్షక నీమకుక్షిని ◆ లోకముల్ దనరార భూ।
లోకమందునఁ బుట్టినావని◆లోకు లెంచుటవింత లో।
కైకభర్తవు రూపహీనుఁడ ◆ వాదిమధ్యము నంత
ముఁ। లేక యొప్పుచు నుండువాఁడవు ◆ నిన్ భజిం
చెద యీశ్వరా!॥ 118.

తోటకవృత్తము॥ మక్కువమీఱఁగ ◆ మానసమందుఁ।
నిక్కముగా నిను ◆ నిశ్చల భక్తిఁ।
మ్రొక్కెడివారల ◆ ముజ్జల నెల్లఁ।
గ్రక్కునఁ దీర్తువు ◆ కంజదళాక్షా! ॥ 114.

క॥ మానము నీ పదభక్తిని।
గానము సేసెదము, నీదు ◆ కథ లనయంబుఁ।
గానము నీకు సమానుని, ।
ధ్యానము సేసెదము నిన్ను ◆ దనుజవిపక్షా! ॥ 115.

క॥ అని తన్ను నుతియొనర్చెడి।
వనజాసను దేవతలను ◆ వారని కూర్మిఁ।
గనుఁగొని దశరథసుతుఁ డి।
ట్లనియెఁ దరహాసమమర ◆ నాననమందుఁ॥ 116.

ఉ॥ మీారలు సర్వకాలమును • మిక్కిలి కూరిమితోడ భద్రి
నిం । పారఁగఁ బ్రోవఁగావలె మ • హాత్ముఁడు మత్ప్రియా
భక్తుఁడై తగున్ । వారిజసంభవా ! దివిజవల్లభ ! నాప్రి
యభక్తబృందముల్ । వారని సంతసంబుఁ గన • వారి
సంతసమే ను గాంచెదన్॥ 117.

ఆ॥ వె॥ రామభద్రుఁడనుచు • ప్రజలెల్ల ననుభక్తిఁ ।
గొలుచుచుండ నిచట • నిలచియుందుఁ ।
ప్రజలమేలుఁ గోరి • భవ్యుఁ డీ భద్రుండు ।
నన్ను నిటకుఁదెచ్చె • నయముమీఱ॥ 118.

## —• భద్రాద్రి మహిమ •—

సీ॥ ఇచ్చటఁ బ్రవహించు • నీ గౌతమీనది ।
విరజానదియటంచు • విమలభద్రి ।
శిఖరంబు వైకుంఠ • సీమయంచు దలంచి ।
యిచ్చోట నివసించు • సచ్చరితులు ।
పుత్రపౌత్రాదులఁ • బొంది సంపదలతో ।
నలరారుచుండెద • రనుదినంబు ।
నంత్యకాలంబున • నలవికుంఠపురంబుఁ ।
జేరంగఁ గలరు మ • కృపతోడ ।

గీ॥ నన్నుదానామలను నిట • నాచరించి ।
ప్రజలు భక్తితోడను భాను • వారమందు ।

పదిని స్నానంబుచేసి యీ • నగముచుట్టు ।
మూఁడుసారులు దిరుగంగఁ • బుణ్య మొదవు॥ 119.

ఆ॥ వె॥ రామభద్రుఁడిట్లు • బ్రహ్మవలకుఁ జెప్ప ।
వారు సంతసించి • వారివారి ।
తావులకును జనిరి • తాపసోత్తములార ! ।
వినుఁడి భద్రి పూర్వ • విమలచరిత ॥ 120.

సీ॥ అని సూతుఁడిట్లనె • నా శౌనకాది ము ।
నీశ్వరవరులతో • నిలను మున్న ।
త్రేతాయుగంబులు • దీపించె నెన్నిమే ।
నట్టిదా నొక త్రేత • యందు రాముఁ ।
డనుజసమేతుఁడై • యతివతో దండకా ।
రణ్యంబునకువచ్చి • రహిఁ చెలంగ ।
నతి నిర్మలంబును • నతి విశాలంబునై ।
యలరారు పాషాణ • మచటఁ గాంచి ।

గీ॥ దానిపై విశ్రమింపంగ • ధరణిపతికిఁ ।
గరము సౌఖ్యంబు గలిగిన • కారణమున ।
మేరుగిరికి సూనుండవై • మించి నాదు ।
భక్తి నలరారఁగలవని • ప్రభుఁడువల్కె॥ 121.

క॥ ఆపాషాణమె వినుఁడీ ।
యేపారఁగ భద్రుఁడనఁగ • నిలపైఁ బరగెఁ ।

భూపాలుఁడైన రాఘవు |
శ్రీపాదంబుల వహించు • శిఖరమునందుఁ ॥ 122.

ఆ॥ వె॥ భద్రపర్వతంబు • బహుపుణ్య భాజనం |
బగుచు నలరుచుండు • నవనియందు |
భద్రు మహిమఁ దెలుపు • భావుకకథ నొండు |
పలుకువాఁడ వినుఁడి • భవ్యులార ॥ 123.

—• శేషేశ్వర చరిత్రము, ఉష్ణకుండము •—

సీ॥ పూర్వకాలమునందుఁ • బుణ్యచారిత్రుండు |
శేషుండు పాతాళ • సీమయందుఁ |
బూజ్యంబుగాఁ దాను • రాజ్యంబుఁ జేసెడి |
తఱినిఁ గొందఱు ఖలుల్ • దనుజులతని |
రాజ్యహీనునిఁజేయ • బ్రహ్మ చెంతకుఁబోయి |
శేషుండు తనదు దు • స్థితినిఁ దెలుప |
బ్రహ్మ యిట్లనియె నో • పన్నగవల్లభా |
భద్రాద్రి నా నొప్పు • పర్వతంబు |
గీ॥ ధాత్రి వెలుగొందు గౌతమీ • తటమునందు |
నచ్చటికినేగి యీశ్వర • ధ్యాన మొనరఁ |
జేయఁగా నీదు కష్టముల్ • శిథిలమగును |
ననుచు ధరణికి నేగెన • య్యహివిభుండు ॥ 124.

గీ॥ ధారుణికి నేగి గౌతమీ • తీరమందు |
భద్రగిరి దరి నత్యంత • భక్తితోడ |

శంకరునిఁగూర్చి చేసెను • జపతపంబు
లగ్నికుండంబు నొకదాని • నచట నిలిపి॥ 125.

ఉ॥ అం దభిచారహోమము మ • హాత్ముఁడు శేషుఁడొనర్ప మె
చ్చి యా । యిందు కళావతంసుఁడు మ • హేశుఁడువచ్చి
యహీశ చెల్పు నీ । డెందములోని వాంఛ భవ • దీయ
జపాదుల కాత్మలోన నా । నందముఁ జెందినాఁడ నన •
నాగవరేణ్యుఁడు మోదితాత్ముఁడై॥ 126.

గీ॥ శంభుతో నిట్టులని పల్కె • శంకర ! హర ! ।
విన్నపముఁ జేయుచున్నాఁడ • వినుము కరుణ ।
దానవులు రాజధానిపై • దాడివిడలి ।
యాక్రమించిరి కృపఁగావు • మా మహాత్మ! ॥ 127.

గీ॥ భక్తసులభుండు భర్గుఁ డా • పలుకులు విని ।
వేడ్క దలఁకొత్త నా ఫణి • విభున కొసఁగె ।
శూలమొక్కటి ; దానిచేఁ • గూలనేసి ।
సర్వవైరుల ననిలోన • సర్పరాజు॥ 128.

సీ॥ ఫణిపతి యారీతిఁ • బశుపతి మెప్పించి ।
శూలంబుఁ గైకొన్న • చోటు కరము ।
శేషేశ్వరంబన • క్షితిమీఁదఁ జెన్నారె ।
నభిచారహోమంబు • నతఁ డొనర్చి ।
నట్టి యాకుండంబు • ఖ్యాతిని వహియించె ।
నుష్ణకుండంబు నా • నుర్విలోన ।

నచ్చోటి నీరంబు • లత్యుష్ణముగ నుండు ।
బ్రహ్మలోక పాతాళ • గంగ లచట ।

గీ॥ సంగమించుట కతన నా • స్థాన మధిక ।
పావనంబయ్యె నచ్చోట • భక్తితోడ ।
స్నానపానాదులను జేయు • జనుల ముక్తి ।
కాంత వరియించుచుండును • సంతసమున॥ 129.

సీ॥ వెలఁగి యీవిధమునఁ • జేయంగనోపని ।
మనుజులు భద్రాద్రి • మహిమ తమదు ।
మానసంబులయందు • మహితసుభక్తితో ।
నిచ్చలుఁ దలపోసి • నగడికేని ।
కామితార్థంబులఁ • గైకొని సుఖయింతు ।
రంత్యకాలమున వా • రరుగ గలరు ।
పరమహర్షంబునఁ । బరమపదంబున ।
కని సూతుఁ డిట్లనె • మునులతోడ ।

గీ॥ రామనవమిని భక్తితోఁ • బ్రజలు భద్రి ।
శిఖరమున రామభద్రుని • సేవఁజేసి ।
రామకీర్తనములఁ బాడి • రాత్రియందు ।
మేలుకొనినంత వారికి • మేలుగలుగు॥ 130.

గీ॥ రామభద్రుని మదలచే • బ్రబలుచుండు ।
భద్రశిఖరంబుచుట్టును • బ్రథిత తీర్థ ।

రాజసులుగాన నట మూను • రాత్రిలెలని ।
జనులు వసిఋంపఁగలుగు శా • శ్వతసుఖంబు॥ 181.

సీ॥ మఱియు నొక్కవిశేషంబు • మానులార ! ।
వినుఁడి నారదునకు మున్ను • వేద్య-మీాఱ ।
భద్రశిఖరి మాహాత్మ్యము • బ్రహ్మ దెలుప ।
నచటికేగెను సురమాని • యధికభక్తి॥ 182.

క॥ చిరకాలము శ్రీరాముఁ ।
గరమరుదుగఁ గొల్చి రమ్య • గానాదుల భూ ।
వను మెప్పించెను బిమ్మట ।
సురలోకంబునకుఁ బోయె • సురముని పేర్మిన్॥ 183.

క॥ భద్రాద్రిచరిత మెవ్వఁడు ।
భద్రాచలధాము కరుణఁ • బ్రబలుత ధర సీ ।
భద్రాద్రిచరితఁ జదువఁగ ।
భద్రంబులు గలుగుఁ గాక • పాఠకతతికిన్॥ 184.

క॥ అని తెల్పు సూతుఁ గనుఁగొని ।
మునివర్యులుపొగడి రతని • బుధనుత ! నీచే ।
ఘనుఁడగు భద్రుని చరితన్ ।
మనమలరఁగ వింటిమయ్య • మాన్యచరిత్రా॥ 185.

గీ॥ సూతుఁ డీరీతి మునులకుఁ బ్రీతితోడ ।
నెఱుఁగఁ బల్కిన భద్రాద్రి • చరితమైన ।

దీని ముగియించుటకు మున్ను • తెలుపువాఁడ।
స్వాంత మలరంగ గోపన్న • చరిత కొంత॥ 136.

—• గోపన్న చరిత్రి •—

సీ॥ చెలువారుచుండును • గలియుగ వైకుంఠ।
మనఁగ భద్రాచలం • బవనిలోన।
శ్రీరామభక్తిచేఁ • జెలఁగెడి తమ్మల।
దమ్మక్క నా నొప్పు • ధన్యురాలు।
స్వప్నంబులో రామ • చంద్రుఁ డానతి యిచ్చి।
నట్టు లారఘుపతి • కధికభక్తిఁ।
బూజల నొసరించి • బుధ నుతుండగు భద్రి।
రెడ్డి సహాయంబుఁ • బ్రీతినొంది।
గీ॥ చిన్నమంటప మచ్చోటఁ • జెన్నుమీఱ।
విబుధులెన్నంగఁ గట్టించెఁ • బిదప నటకుఁ।
బ్రథితయశుఁడైన గోపన్న • భక్తితోడ।
నేగి రఘురాము దర్శించు • నిచ్ఛ వొడమి॥ 137.
గీ॥ కొండపల్లి నివాసుడా • గోపనాఖ్యుఁ।
డతఁడు భద్రాద్రి మహిమంబు • నవధరించి।
భద్రిగిరిధాముఁ గొలిచెడి • భాగ్యమెప్పుడా।
యనుచుఁ జింతించుచుండు ని • త్యంబు మదిని॥ 138.
గీ॥ అతని కొకరేయి స్వప్నంబు • నందు రాముఁ।
డధికకృపఁ గానుపించి యి • ట్లనియె వత్స!।

సిప్ప గోల్కొండకేగి తా • నీషఁ జూఁడు ।
మతిని కతన మేలయ్యెను • ననఘ వింటె" ॥ 139.

గీ॥ అంత గోపన్న మేల్కాంచి • యా ప్రతతిఁ ।
వేడ్క నీక్షించె శ్రీరామ • విభుని ముదల ।
నాదినమునందె గోల్కొండ • కతఁడు వోయి ।
నిలచె వినయంబుతోడఁ దా • నీష మ్రోల॥ 140.

సీ॥ తానీష యతనికి • దయతోడ నిట్లనె ।
భద్రాద్రిమండల • ప్రభుత నీకు ।
నొసఁగినారము గాన • వెసఁబోయి తహసీలు ।
దారు కార్యంబులఁ • దగ నొనర్పు
మని యాజ్ఞనొసఁగిన • నతఁ డతి ముదితాత్ముఁ ।
డగుచు భద్రాద్రికి • నతిరయమునఁ ।
జనుదెంచి సామి సా • మ్మని తలపోయక ।
భద్రాచలముమీఁద • భవ్యమైన ।

గీ॥ కోవెలను దగనిర్మించి • గోపురంబుఁ ।
గట్టి యచ్చోట జానకీ • కాంతునకును ।
భక్తిపెంపునఁ బూజలు • ప్రతిదినంబుఁ ।
జేయుచుండెను నిర్మల • చిత్తుఁడగుచు॥ 141.

గీ॥ అంతఁ దానీష యతని చ • ర్యలను భటుల ।
వలన నాలించి కోపించి • భటులఁ గాంచి ।

యతనిఁ ద్రోయుఁడీ చెఱసాల • యందు ననుచు ।
నానతిచ్చిన వారలా • యనఘుఁ బట్టి॥ 142.

క॥ కారాగృహమున నుంపఁగ ।
ధీరుఁడు గోపన్న మది ను • తించుచు నుండెన్ ।
వీరుఁడగు రామభద్రుని ।
గారవమున నంత నతనిఁ • గాఁచెను కాంక్షన్ । 143.

క॥ రాముఁడు తమ్మునితోడన్ ।
ప్రేమన్ దానీషదరికి • వెడలి యతనితో ।
"మేమిదె గోపన భటులము ।
మేమొసఁగెడి ధనము గొనుమి • మిషగాదు సుమీ!" 144.

గీ॥ ఇట్లు తానీషతోడ సీ • తేశుఁ డెలమిఁ ।
బలికి ద్రవ్యంబుఁ జెల్లించి • నిలువ కపుడె ।
వెడలె నిసిలోనఁ ; దానీష • వెఱఁగు పడుచు :
దారమేల్కొల్పి తెల్పె వృ • త్తాంత మెల్ల॥ 145.

గీ॥ బంటువేసంబుఁ దాల్చి • భక్తకోటికి ।
మనగృహంబున కేతెంచె • నినకులుండు ।
భక్తవత్సలుండనుచును • బ్రాజ్ఞులాడు ।
వాక్యమది యేల తప్పునే • వారిజాక్షి! ॥ 146.

క॥ రాముఁడు వచ్చిన మన మా ।
సామికిఁ దగినట్టి పూజ • సలుపమి కకటా !

నామనమున దుఃఖించెద ।
నోమానిని యనుచుఁ బలికె • సుగ్మలితోడఁ॥ 147.

గీ॥ వేగనంతన భటుల రా • వించి వారిఁ ।
బంచి గోవన్నసటకు ర • ప్పించి మించి ।
యంచితోక్తుల నతని మ • న్నించి మోము ।
వంచి యిట్లనెఁ దానీశ • భక్తునకును॥ 148.

ఉత్సాహ॥ ఇంతవాఁడ వనుచు నేను • నెఱుఁగనైతినయ్య గో।
రంతయైన నీదుమదిని • నలుక బూనవలదు ధీ।
మాత ద్రవ్యమిదిగో దీని • మహితదయను జానకీ।
కాంతునకు నొసంగుమనఁగఁ • గరముసలరె నా
తఁడుగ॥ 149.

గీ॥ పిదప శ్రీరాముకరుణను • బ్రియముతోడఁ ।
జారగొనియెఁ గైవల్యంబు • సుజనహితుఁడు ।
రామదాసగు గోవన్న • ప్రథితయశుఁడు ।
భద్రము లొసంగు జనులకా • భవ్యచరిత॥ 150.

తరలము॥ ధరణినాయక! రూపనిర్జిత • దర్పకా! రఘునాయకా।
పరమపావననామ! దానవ • భంజనా! కరుణాకరా! ।
ఖరకరాన్వయ వార్ధిచంద్రమ! • కంధిగర్వనివారణా! ।
దురితవారణ! కీర్తినిర్జిత • తోయజారి హిమాంబుజా!॥

భుజంగప్రయాతము॥ సరోజాక్ష! శ్రీరామ! సర్వేశ! ధీరా! ।
సురారాతి సంహార! శూరాగ్రగణ్యా! ।
ధరాజావరా! మేరు ధైర్యా! మహాత్మా!।
స్మరారాతిలోకేశ వంద్యా! 152.

గద్య॥ ఇది శ్రీరామచంద్ర పాదారవిందసేవా పరాయణ
పైడిపాల గోత్రపవిత్ర బొంతాశ కోవంశ
రామస్వామి పుత్ర బుధజన విధేయ
సూర్యనారాయణ నామధేయ ప్రణీ
తంబైన నిర్వచన భద్రాద్రి
చరితంబునందు సర్వ.
మేకాశ్వాసము.

శ్రీ భద్రాద్రిచరిత్రము సంపూర్ణము.



# తప్పొప్పులపట్టిక.

| పుట సంఖ్య | పద్యము సంఖ్య. | పాదము సంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 3 | 5 | 3 | జననములు | జనవిఘులు |
| 6 | 17 | 2 | తపము | దపము |
| 26 | 96 | 3 | సంసరణాబ్ధి | సంసరణాబ్ధి |
| 30 | 112 | 2 | నానర్పితవార | నానర్పితవార |